Registered No. M-4484

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ అక్టోబరు నెల 2 వ తేది శుక్రవారం [నె 39 రు.

## యుద్ధ విమర్శ.

### రెండో యుద్ధరంగం వాదోపవాదాలు - రష్యాకు సహాయం

రెండో యుద్ధ రంగం

"జయించే వ్యూహం" అను శీర్షకతో వెండలు విల్కీగారు ఈజిప్టు రష్యాలకు పోవుటనుగూర్చి లండను టైమ్సుపత్రిక విమర్శించుచు, వారి రాక సంయుక్తరాజ్యాలన్నింటికి శ్రేయస్కరమనెను. వారు రెండో యుద్ధ రంగం ఉండాలను వాదమునకు నిష్పాక్షికపు పెద్దల ధృవపత్రము నొసంగిరి. ఆలశ్యమయిన కొలదీ కీడేకాని మేలులేదని వారు నమ్ముచున్నారనెను. రెండో యుద్ధరంగం కోరుట ఒక్కొక్కప్పుడు తెలియకచేయవచ్చును, దానివలనప్రమాదంకూడా యుండవచ్చును. కాని ఆ వాదమునకు మంచి ఆధారమే కలదనుచు టైమ్సుపత్రిక యిట్లు వ్రాసెను.—

"విజయం చేకూరేలోపల జర్మనీ రెండేమిటి యింకా యెక్కువ రంగాలలో యుద్ధం చేయవలసిన అవసర మేర్పడవలెను 1918 లోవలె జర్మను సైన్యాలు ఇంగ్లాండు అమెరికా సైన్యాలచే ఓడింపబడవలెను"

సైన్యాన్ని ప్రజలు ఒత్తిడిచేసి రెండో యుద్ధ రంగం యేర్పాటు చేయించాలను విల్కీగారి సూచనకు అమెరికా ప్రజలు ప్రతికూలంగా నున్నారు. న్యూయార్కు టైమ్సుపత్రిక యిట్లు వ్రాసింది:—

"రెండో యుద్ధరంగంగూర్చి రష్యాలోగాని, లండనులోగాని, అమెరికాలోగాని ఒక్కవిషయమునందే భిన్నాభిప్రాయముండును—అది ఎప్పుడు ఎక్కడ ప్రారంభించాలీ అనియు, ప్రారంభించుటకు కొంతవరకు రాజకీయ కారణా లుండవచ్చునా లేక పూర్తిగ సైనిక కారణాల ననుసరించియే ప్రారంభించాలా, యనియు"

యూరోపులో సంయుక్తరాజ్యాలు ఓడితే ఎవ్వరికీ మేలు కలుగదు. రష్యాయొక్క శత్రువును ఆ శత్రువుకి ఎక్కడ బాగా దెబ్బతగుల గలదో అక్కడ ఘట్టిగా కొట్టుట యుక్తమని అందరంగీకరింతురు. కావున రెండో యుద్ధ రంగం ఉచితసమయమున ప్రారంభించుట మంచిదంటూ ఆ పత్రిక యిట్లు వ్రాసెను —

"స్టాలిన్గ్రాడు నగరం శిథిలమగుటచేతను, అచట చనిపోయిన, చనిపోవుచున్న రష్యనులద్వారాను, రష్యాజాతి జయింపబడనేరదని మనం తెలుసుకొంటిమి బ్రిటను అమెరికాలు స్టాలిన్గ్రాడు ముట్టడిని తొలగింపజాలక పోవచ్చును, కాని ఆ నగరం రక్షించుచున్నవారి కార్యదీక్ష పట్టుదల ననుసరించి రష్యా ముట్టడిని తొలగించుటకు అవి తోడ్పడవచ్చును"

ఈరీతిగా జర్మనీకి తూర్పున రష్యాతోనేగాక పడమరను యింకో శత్రువుతో పోరాడవలసిన అవసరం కలిగించే రెండో యుద్ధరంగం యేర్పరుచుటగూర్చి తిరిగి వాదోపవాదములు బయలుదేరినవి. ఇందు కనేక కారణాలున్నాయి. గత జూను మాసంలో ఇంగ్లాండు-రష్యాలు ఒడంబడిక సంతకాలు చేసినపుడు, "1942 లో యూరోపునందు రెండో యుద్ధరంగం ప్రారంభించుటగూర్చి ఇంగ్లాండు-అమెరికా-రష్యాలకు పూర్తిగ అంగీకారము కుదిరెను" అని బ్రిటిషు ప్రభుత్వంవారు ప్రకటించియుండిరి. ఈ ప్రకటనలో 1942 లో రెండో రంగం ప్రారంభింపబడునని చెప్పలేదుగాని, దానియొక్క అవశ్యకతమాత్రం స్పష్టపరుచబడెను. అయినప్పటికి యీయేడే అట్టి రెండో యుద్ధరంగం ప్రారంభింప వాగ్దానం చేసినట్లు పలువురు ఎంచుచున్నారు. ఈ ఒడంబడిక జరిగిన పిమ్మటనే జూలయిలో ఇంగ్లాండు-అమెరికా సైనికోద్యోగులు సమావేశమగుట, చర్చిలుగారును రూజువెల్టు అధ్యక్షుని ప్రతినిధిగ వెండలు విల్కీగారును మాస్కోనగరం పోవుట సంభవించెను. రెండో యుద్ధరంగం ప్రారంభించుటకు స్టాలినుతో ఆలోచించి తేదీ నిర్ణయించుటకే చర్చిలు మాస్కో వెళ్లేడనికూడ కొందరనుకొన్నారు.

* * *

ఇపుడు రెండు ప్రశ్న లడుగుచున్నారు. ఈ యేడే రెండో యుద్ధరంగం ప్రారంభించేమాటుంటే అది వెంటనే ప్రారంభించ నవసరం లేదా యని. ప్రారంభించకుంటే రష్యాను విడనాడినట్లుకాదా యని, స్టాలినుగ్రాడు వీరులు ఆత్మరక్షణ అద్భుతంగా చేసుకొనుట యీ వాదము మరింత దృఢపరచుచున్నది. ఈజిప్టులో శత్రువుపై పురోగమన దాడిగాని, జర్మనీపై విమానదాడిగాని యూరోపులో రెండోరంగం వంటివి కానేరవని అందరు గుర్తించిరి అందుచే యూరోపులో రెండో యుద్ధరంగం వెంటనే ఎందుకు ప్రారంభించలేదు ? ఈ సమస్య ఒకే ఒక మూలసూత్రంపై నిర్ణయింపబడవలసియున్నది

రష్యాకు సహాయం చేయడమే ప్రధానం.

రష్యాకు సహాయంచేయక తప్పదు. రెండో యుద్ధరంగం ప్రారంభించి నిష్ప్రయోజనమయినచో అది ఉన్నంతకాలంలో రష్యాకుచేసిన సహాయంకన్న, చివరకు నష్టం ఎక్కువ కలిగించును అక్కడ కలిగిన నష్టాలు పూడ్చుకోవాలి. అనగా రష్యా జర్మనితో యుద్ధం చేయవలసిన కాలం యింకా దీర్ఘమగును అపుడు జర్మను సైన్యాల పూర్తిబరువంతా రష్యాపై బడును అందుచే రష్యా యింక కొంచెంకాలం సహించి యుండినచో, మిత్రమండలివారు రెండో యుద్ధరంగం తెరుచుటేగాక దీర్ఘకాలం కొనసాగించుటకుగూడ వీలగును అపుడు నాజీతత్వం అంత్యక్రియలు జరుపవచ్చును. అంటే, రెండో యుద్ధరంగం నిర్ణయం కేవలం సైనిక ప్రయోజనము ననుసరించి జరగాలన్నమాట రెండో యుద్ధరంగానికి యీ దిగువ ఆరు నియమాలుండాలి:—

(1) తెంపులేని విమానదాడికి తగిన విమానశక్తి ఉండాలి.

(2) శత్రువు తూర్పునుండి పడమరకు తన సేనను మరల్చుటకు తగిన ఒత్తిడి కలిగించునట్టి స్థిరమగు పెద్ద సైన్యం అక్కడనుంచితే, దానికి సరిపోవు సప్లయిలు పోవుటకు తగినన్ని నౌకలుండాలి.

(3) శత్రువుతెచ్చు ఆయుధ సామగ్రి నెదుర్కొనుటకు సరిపోవునంత ఆయుధ మందుగుండు సామగ్రి యుండవలెను.

(4) యూరోపులో రెండో యుద్ధరంగం ఏర్పరుచుటవలన ఈజిప్టు ఇండియాలలో మన రక్షణ విధానమునకు నష్టం కలుగరాదు.

> **ఇండియాలోని యూరోపియనులు.**
>
> "ఇండియాలోనున్న యూరోపియను లందరు బ్రిటిషు ప్రభుత్వంవారు చేసిన వాగ్దానమును బలపరచుచున్నారు. దానిని అమలు జరుపుటకు మా శక్తికొలది పని చేయుదుము. ఎందువల్లనైన ప్రభుత్వంవారు ఆ వాగ్దానం చెల్లించకపోతే, ప్రభుత్వంవారికి ప్రతికూలంగా ఉద్యమానికి నేనే నాయకత్వం వహిస్తాను."
>
> —పి జె గ్రిఫిత్సుగారు, భారత శాసన సభలో యూరోపియను పక్షం డిప్యూటీ లీడరు 17-9-42 వ తేదీ చర్చలో.

(5) ఈ నూతన యుద్ధరంగానికి బ్రిటను అమెరికాలనుండి అదనపు సైన్యం తేగలమను నమ్మకం మనకుండాలి

(6) శత్రుమార్గాలను నిరోధించుటకు మనకు శక్తియుండాలి

కావున, రెండో యుద్ధరంగం లేకపోతే పోయెగాని, ప్రారంభించి విఫలమయినచో మరీ ప్రమాదమేర్పడుననుట సువిదితము కాని రెండోరంగం ఏర్పడక మానదు జరిగించే అవకాశం కలుగగానే, దాన్ని చిరకాలం కొనసాగించ వీలయినపుడే అది ప్రారంభింపబడును. ఫ్రాంసులో కొంతసేన దింపినంతమాత్రాన రెండోరంగం ప్రారంభించుట కానేరదు ; జర్మనీ లోభాగాలపై దాడిచేయగల్గి యుండాలి. రెండోరంగం ప్రారంభించి ఊరుకోలేము. ముందుకి సేనలు సాగిపోతూ వుండాలి, లేకుంటే వెనక్కిపోవలసి వస్తుంది. అందుకు బ్రహ్మాండమగు యత్నం శ్రద్ధగ జరగాలి. అందుకనే కేవల సైనిక ప్రయోజనము ననుసరించే యీ విషయమున స్థిరనిర్ణయం చేయవలసి యుండును. అసలువిషయం లోగుట్టూ తెలిసిన నాయకులలో కొద్దిమంది ముఖ్యులు మాత్రమే, రష్యాకు సహాయం చేయుటకు రెండో యుద్ధరంగం ఎపుడు ప్రారంభింపబడునో తేదీ నిర్ణయింపగలరు. అంతే. ఇతరులుచెప్ప వీలులేదు.

# సముద్ర లావాదేవీ మానసంరక్షణం.

జర్మనీ, ఇటలీ, జపాను అను మూడు అక్ష రాజ్యాలున్నూ కలిసి ఒక మైత్రి పత్రమును వ్రాసికొన్నవి ఈ మూడు రాజ్యాలున్నూ కలిసి ఒక్క త్రికూటంగా ఉండి మహా సంగ్రామమును సాగించవలెనని నిశ్చయించుకొన్నవి. ఈ త్రికూట మైత్రి పత్ర ద్వితీయ వార్షికోత్సవం అయిదారు రోజులక్రింద జరిగింది. ఆ సందర్భంలో జర్మను విదేశాంగ మంత్రియైన రిబ్బెనుట్రాపు ఉపన్యసిస్తూ ఒకమాట అన్నాడు "ముందు ముందు ఇంకా పెద్ద యుద్ధం జరుగవలసియున్నది" అన్నాడు. ఈ వార్షికోత్సవ సందర్భంలోనే జపాను విదేశాంగ మంత్రియైన టానాగారు, యీ క్రింది సందేశమును జర్మనీకి పంపించారు. "ఈ మహాసంగ్రామము అయిరోపా ఖండమునకున్నూ, తూర్పు ఆసియా ఖండమునకున్నూ మాత్రమే వర్తించవలెనని ప్రారంభంలో సంకల్పింపబడినది, ఇతర ఖండములకుగాని ఇతర ప్రాంతాలకుగాని యీ సంగ్రామం విస్తరించకూడదని ఉద్దేశింపబడినది" అని వెల్లడించారు.

ఈ మాటలయొక్క అర్థమేమిటి? అమెరికాతోను, ఇంగ్లాండుతోను యుద్ధం ప్రకటించి విరోధం పెట్టుకొన్నప్పుడు, ఈ మహాసంగ్రామం అన్ని రాజ్యాలకు విస్తరించి, వర్తించకమానదు. ఇది ప్రపంచ సంగ్రామం కాక మానదు. ఎందువల్లననగా, బ్రిటిష్‌వారి సామ్రాజ్యం ప్రపంచమంతటనూ విస్తరించి ఉంది బ్రిటిష్‌వారితో సంబంధించిన యుద్ధం అఖిల ప్రపంచ యుద్ధం కాక మానదు, అమెరికా సంయుక్త రాష్ట్రములతో యుద్ధం ప్రారంభించినయెడల, అమెరికా ఖండంలోని రాజ్యాలన్నింటితోను సంఘర్షణ రాకమానదు. ఇటు అట్లాంటిక్కు మహాసముద్రంలో 3 వేల మైళ్ల వరకున్నూ అటు పసిఫిక్కు మహా సముద్రంలో 5 వేల మైళ్ల వరకున్నూ విస్తరించిన సముద్ర మార్గములమీద యుద్ధములు జరిగి తీరవలెను అమెరికానుంచి ఆస్ట్రేలియాకు పసిఫిక్కు మహాసముద్రంలో 5 వేల మైళ్లు నావలు ప్రయాణం చెయ్యాలి. అమెరికానుంచి ఇంగ్లాండుకు అట్లాంటిక్కు మహాసముద్రంలో 3 వేల మైళ్లు ప్రయాణం చెయ్యాలి ఇంగ్లాండునుంచి ఇండియాకు ఆఫ్రికా ఖండం చుట్టు తిరిగి రావలెనంటే రమారమి 10 వేల మైళ్ల సముద్ర ప్రయాణం చేసిరావాలి ఇండియానుంచి ఆస్ట్రేలియాకు పోవాలంటే రమారమి 5 వేల మైళ్ల సముద్రప్రయాణం చెయ్యాలి ఆఫ్రికా ఖండంనుంచి ఆస్ట్రేలియాకు పోవలెనంటే రమారమి 5 వేల మైళ్ల సముద్ర ప్రయాణం చెయ్యాలి ఈ విధంగా బ్రిటిష్ నావలు ప్రపంచమంతటను విస్తరించియున్న బ్రిటిష్ సామ్రాజ్య దేశాలకు సముద్రాలమీద తిరుగుతూ భూ ప్రదక్షిణములు చేస్తూఉంటాయి ఈ సముద్ర మార్గము అన్నింటిలోను విస్తారంగా ప్రతిదినం బ్రిటిష్ సరకుల రవాణాలు, అమెరికను సరకుల రవాణాలు జరుగుతూ ఉండాలి బ్రిటిష్ సామ్రాజ్యంలో చేరిన అనేక రాజ్యాలనుండి ముడి సరకులు ముఖ్యమైన యుద్ధ రంగాలలోని బ్రిటిష్ సేనలకు చేరుతూ ఉండాలి. అమెరికానుంచి అపారమైన యుద్ధ సామగ్రి ఇంగ్లాండుకుచేరాలి. అమెరికానుంచి ఇంగ్లాండుకు యుద్ధ సామగ్రులు సప్లయి అగుచున్న విధంగానే, ఇంగ్లాండులో విరివిగా తయారగుచున్న కొన్ని రకముల ఆయుధములు వగైరా అమెరికాకుకూడా సప్లయి అవుతున్నాయి. ఈ విధంగా సముద్ర మార్గముల మీద జరిగే లావాదేవీలను—అనగా యిచ్చిపుచ్చుకొనుటను—అరికట్టవలెనంటే, ప్రపంచమంతటా విస్తరించిన యీ సముద్ర మార్గముల నన్నింటిని అరికట్టవలెను.

మెట్టమీద కట్టినట్లుగా సముద్రంమీద అడ్డంగా గోడలుగాని కోటలుగాని కట్టుటకు వీలులేదు. అందువల్ల యీ సముద్ర మార్గములలో జర్మను జలాంతర్గములు, దారులుకొట్టెడి దొంగలవలె తిరుగుతూ ఉన్నాయి. అమెరికను సప్లయి నావలనుగాని, బ్రిటిష్ సప్లయి నావలనుగాని ముంచివేస్తున్నాయి. ఇటీవల, జపాను జలాంతర్గములుకూడా కొన్ని పసిఫిక్కు మహాసముద్రం దాటి అట్లాంటిక్కు మహాసముద్రంలోనికి చేరినవని వార్తవచ్చింది. అమెరికానుంచి ఇంగ్లాండుకు ఆయుధ సామగ్రుల సప్లయిపోకుండా యీ అట్లాంటిక్కు మహాసముద్రంలో అమెరికను నావలను, బ్రిటిష్ నావలను విశేషంగా యీ శత్రు జలాంతర్గములు ముంచి వేస్తున్నాయి ఈ విధంగా ప్రపంచమంతటను యుద్ధరంగము వ్యాపించక తప్పదు.

కాబట్టి తూర్పు ఆసియా ఖండంలోను, ఐరోపా ఖండంలోను మాత్రమే యుద్ధంచేయుటకు అక్ష రాజ్యాలు సంకల్పించినవనే మాటలో అర్థమేమీ కన్పించడంలేదు. కాని, ఒక అంతరార్థం ఉంది జపానువారు తూర్పు ఆసియా ఖండ రాజ్యాలను మాత్రమే జయించ దలంచుకున్నారనిన్నీ, జర్మనీ ఇటలీలు, ఐరోపా ఖండం లోని రాజ్యాలను మాత్రమే జయించ దలంచుకొన్నవనిన్నీ జపాను మంత్రి చెప్పినమాటలకు అర్థము అయిఉండవచ్చును. ఐరోపా ఖండ భూభాగమునకు చేరియుండక విడిగా ఒక ప్రత్యేక దీవిగాఉన్న ఇంగ్లాండునున్నూ, ఐరోపా ఖండంతోను ఆసియా ఖండంతోను సంబంధంలేకుండా అనేక వేల మైళ్ల దూరంలో ఉన్న అమెరికా ఖండంలోని రాజ్యాలనున్నూ జయించి ఆక్రమించవలెననే సంకల్పం అక్ష రాజ్యాలకు లేదని జపాను విదేశాంగ మంత్రి సూచించదలంచి ఆ మాటలన్నాడు.

ఇంగ్లాండుతో జర్మనీ యుద్ధం ప్రకటించిన తర్వాత, ఇంగ్లాండుయొక్క నౌకా బలమునకు జర్మనీ జవాబు చెప్పజాలదనే విషయం హిట్లరు గ్రహించాడు. ఇంగ్లాండుకు నౌకాదళం అపారంగా ఉన్నది అందువల్లనే ఇంగ్లాండుకు సముద్రాధిపత్యం ఏర్పడింది. అంతేకాకుండా బ్రిటిష్ సామ్రాజ్యం ప్రపంచమంతటా విస్తరించి ఉంది. ఇంగ్లాండు రక్షణకొరకై పోరాడే రాజ్యాలు జర్మనీని చీల్చి చెండాడగలవు. ఇంగ్లాండుతో అమెరికాకుగల సన్నిహిత మైత్రివల్ల అమెరికాతో జర్మనీకి యుద్ధం తప్పదు. అదిన్నీగాక, ఇంగ్లాండుతో జర్మనీ పోరాడే సమయములోనే జర్మనీమీదకు రష్యా రాజ్యం తన బ్రహ్మాండమైన సేనలతో దండెత్తగలదు. అప్పుడు జర్మనీకి నాశనం తప్పదు. ఈ సంగతి సందర్భములన్నీ ఆలోచించుకొని ఇంగ్లాండుమీదకు దండెత్తవలెననే సంకల్పం హిట్లరు మానుకున్నాడు. అటువంటి అభిప్రాయం అక్ష రాజ్యాలకు లేదనేభావం అందుకనే జపాను విదేశాంగమంత్రియైన టానాగారు వెల్లడించారు. వారి సంకల్పం ఎటువంటిదైనప్పటికీ, ఇంగ్లాండుతో అమెరికాతో పోరాడి జయించలేమనే సందేహం ఉంది.

దీనికంతకూ మూలకారణం ఏమిటంటే, జర్మనీకి గొప్పగా చెప్పకోదగిన నౌకాదళం ఏమిన్నీలేదు. అందుకనే సముద్ర యుద్ధం చెయ్యడానికి జర్మనీ జంకుతూ ఉంటుంది ముఖాముఖీగా బ్రిటిష్ యుద్ధ నావలతో జర్మను యుద్ధ నావలు పోరాటమునకు రాలేవు అందువల్ల బ్రిటిష్ నావలను ముంచివేయుటకొరకై జర్మనులు జలాంతర్గాములను ఉపయోగిస్తున్నారు. వీటికే "యూ" బోట్లు అనిన్ని, "యి" బోట్లు అనిన్ని నామకరణం చేసారు. ఈ జలాంతర్గాములు అట్లాంటిక్కు మహాసముద్ర మార్గములలో దొంగలవలె తిరుగుతూ, అమెరికానుంచి ఇంగ్లాండుకువచ్చే నావలను ఇంగ్లాండునుంచి అమెరికాకుపోయే నావలను విశేషంగా ముంచివేస్తున్నాయి. అమెరికాకు ఇంగ్లాండుకు మధ్య సరకుల రవాణాలున్నూ లావాదేవీలున్నూ జరుగకుండా అడ్డగించవలెననే సంకల్పంతో జర్మను జలాంతర్గములు యీ విధంగా నావలను ముంచివేస్తున్నాయి అంతమాత్రం చేత బ్రిటిష్‌వారిని గాని, అమెరికానుగాని, హిట్లరు జయించగలడా ? ద్రౌపదీ దేవిని నిండు సభలోనికి జుట్టుపట్టి యీడ్పించి తెచ్చి, ఆమె చీరెను ఆ సభలో, ఆమె భర్తలైన పాండవులయెదుట, విప్పించి ఆమెను మానభంగంచేస్తే, పాండవులకు మరింత రోషం హెచ్చినదేగాని, కౌరవులకు పాండవులు లొంగిలోబడినారా ? ఒక చీరెలాగితే, ఇంకొక చీరె అంతులేకుండా అక్షయంగా వస్తూనేఉంది. ఆఖరుకు ఆమెకు మానభంగం చెయ్యడంకూడా కౌరవులకు సాధ్యంకాలేదు. అక్షయమైన ఆ చీరె పరిమాణం తెలియకుండా ఆ మానభంగ ప్రయత్నం దుర్యోధనుడు చేసాడు. ఈ మానభంగ ప్రయత్నంలో అతనికే ఆశాభంగం, శృంగభంగం అయింది అమెరికా ఇంగ్లాండుల నౌకాబల పరిమాణం ఎటువంటిదో హిట్లరు గ్రహించలేక, దుర్బుద్ధితో దుర్యోధనునివలె ప్రవర్తిస్తున్నాడు అక్ష రాజ్యాల అగౌరవ తంత్రం ఆ కౌరవ తంత్రంలాగున వ్యర్థమవుతూ ఉంది. బ్రిటిష్ అమెరికా నౌకా పరిమాణం అపారంగా అక్షయంగా వృద్ధిఅవుతూ ఉన్నది.

జర్మను జలాంతర్గాములు ఎన్ని నావలను ముంచివేస్తున్నాయో, అంతకు రెండింతలుగా అమెరికా ఇంగ్లాండులలో కొత్త నావలునిర్మిస్తున్నారు. అమెరికాలోని పశ్చిమ కోస్తాలో హెన్రీ కెయిజరు అనే గొప్ప ఇంజనీరు అనేక నౌకా నిర్మాణశాలలను ఏర్పాటుచేసి, అనేక నావలను ఏకకాలమందే నిర్మించి సప్లయిచేస్తున్నాడు. 10,500 టన్నుల

# వర్తక నౌకల సాముదాయిక ఉత్పత్తి.



ఇంగ్లాండులోను అమెరికాలోను నౌకలను వందలు వేలు ఒకేసారి తయారుచేయుచున్నారు. ఇపుడు మునుగుచున్న రేటు కన్న ఉత్పత్తి రేటు హెచ్చినది. ఒక్క అమెరికాలోనే 1942-43 లో 120 లక్షల టన్నుల నౌకలు నిర్మింపనున్నారు.

బ్రిటిషు నౌకా నిర్మాణ శాల యందు పనివారు ఒక ఉక్కు రేకును సాపుచేయుట యీ పటమున కానవగును.

సరకు రవాణా నావను, 13 రోజుల 3½ గంటలలో నిర్మించి నీటిలోనికి మొన్న నీ మధ్యనే వదలినాడు. అనేక నిర్మాణశాలలందు ఏకకాలమందు అనేక నావలను నిర్మించుచుండుటవల్ల రోజుకు రెండు నావలచొప్పున నిర్మించుచున్నాడు. ఈ అక్టోబరు మాసంలో రోజుకు మూడు నావల చొప్పునకూడా నిర్మిస్తానని ప్రతిజ్ఞచేసాడు. వీటికే "లిబర్టీ" నావలని నామకరణం చేసారు. ఇవిగాక అమెరికాలో వందలకొలది యుద్ధ నావలు అనేక రకాలకు చెందినవి అతివేగంగా నిర్మిస్తున్నారు. అమెరికాలో మాత్రమేగాక, ఇంగ్లాండులోకూడా అపారంగా నావలను నిర్మిస్తున్నారు. డెస్ట్రాయిర్లు, క్రూయిజర్లు, విమానవాహక నావలు అమెరికాలో నిర్మింపబడుచున్నవి. గత జూలై 31 తేదీని "ఎస్సెక్సు" అనే విమానవాహక నావను నిర్మించి నీటిలోనికి విడుదలచేసారు. గత వారంలోనే "లెక్సింగుటను" అనే మరొక విమాన వాహక నావను నిర్మించి నౌకాదళంలో చేర్చినారు. ఇంగ్లాండులో రెండు బ్రహ్మాండమైన యుద్ధ నావలను క్రిందటి వారం నిర్మించి యుద్ధానికి సిద్ధపరచినారు. ఒక్కొక్కటి 35 వేల టన్నుల నావ. ఒకదాని పేరు "ఆన్సను" రెండవదాని పేరు "హౌ". గత 2½ సంవత్సరములలోను బ్రిటిష్‌వారికి నష్టమైన యీ సైజు యుద్ధ నావలు రెండే. ఆలోపం ఇప్పుడు భర్తీచేయబడింది. ఇవిగాక అమెరికాలో సరకులను రవాణాచేసే బ్రహ్మాండమైన విమానాలు నిర్మిస్తున్నారు. ఒక్కొక్క విమానము 60 టన్నుల సరకును తీసికొనిపోగలదు హ్యూస్ హవర్డు ఫ్యాక్టరీలో వీటిని నిర్మించుటకు అమెరికాలోని కెయిజరుగారికే బేరం యివ్వబడింది.

ఈ విధంగా అమెరికాకు ఇంగ్లాండుకు మధ్య ఆయుధ సామగ్రులు వగైరా సరకుల లావాదేవీకి భంగంలేకుండా సాగించుటకు తగిన నౌకా నిర్మాణం అక్షయంగా జరుగుతూ ఉంది. ఇటువంటి సందర్భంలో ఎంత యుద్ధసాముచేసినా శత్రు జలాంతర్గాముల సాములు అక్కరకు రావు. అక్ష రాజ్యాల ఆసాములు ఆ సాములు చేయుటవల్ల ఆశాభంగంపొంది ఆఖరుకు ఆత్మ వినాశకారకులవుతారు. అమెరికా, ఇంగ్లాండుల లావాదేవీ ఎటువంటిదో, వారి సముద్ర యాన మానం ఎటువంటిదో అక్ష రాజ్యాలు గ్రహించడం లేదు. ఆ ప్రమాణం వారు గ్రహించలేదని ప్రమాణ పూర్తిగా చెప్పవచ్చు. ద్రౌపదీ దేవీ మానభంగంవలెనే ఈ లావాదేవీ మానభంగం కూడా వ్యర్థమై అక్ష రాజ్యాలను సంహరించవలెననే ప్రతిజ్ఞా సంకల్పమును ప్రజ్వలింప జేస్తోంది. అక్ష రాజ్యాల కుతంత్రం సాగకుండా అక్షయమైన నౌకా నిర్మాణం అనంతంగా జరుగుతోంది. ఎన్ని నావలు నీటిలోనికిపోతే, అన్ని నావలు మరల నీటిమీదకు వస్తున్నాయి. అమెరికా ఇంగ్లాండుల మైత్రి అమోఘ ప్రభావంగలది. ఆ సముద్ర లావాదేవీ మహిమ అద్భుతమైనది. అక్ష రాజ్యాలను భక్షించే ఆదిశక్తి అది.

# యుద్ధానంతర ప్రపంచం.

## సంయుక్త రాజ్యాల సమిష్టి ఆలోచనలు.

ఈడెను మంత్రి వివరించుట

"1940 జూను, జూలై మాసాలలో జర్మనీపై రాయలు విమానాలు 350 టన్నుల బాంబులు వేస్తే, 1941 లో ఆ రెండు నెలలందు 8,500 టన్నులు వేసినవి. 1942 లో జూను, జూలై లందు 13,000 వరకు ఆ సంఖ్య పెరిగెను ఈ నెల మొదటి 14 దినాలలో తొమ్మిదిసారులు జర్మనీపై దాడిలో 5,000 టన్నుల బాంబులు పడవేసిరి జర్మనులు రెండు సార్లుమాత్రం రాత్రి దాడులందు లండను నగరంపై 400 టన్నులకు పైగా బాంబులువేసిరి. వారి కొలోనుపైని 90 నిముసాలలో మనం 1,000 టన్నుల బాంబులు వేసితిమి లండను కొలోనుకన్న ఐదురెట్లు పెద్దది." అని ఆంతోని ఈడెనుగారు, బ్రిటిషు విదేశాంగ మంత్రి 26 వ తేదీ ఉపన్యాసంలో తెలిపిరి. జర్మనీయొక్క యుద్ధ పరిశ్రమలుగల బ్రిమెను, విలుహెల్మ్సుహావెను, డుసెల్డార్ఫుల పైనే తరుచు దాడులు జరుపుచు, ఎక్కువ బరువైన బాంబులు వేస్తూవచ్చేరనియు, జర్మనులను భయపెట్టుట తమ ఉద్దేశంకాదనియు, తిరిగి వారు యితరులకు హాని కలుగకుండా చేయుటే తమ ఉద్దేశమనియు చెప్పిరి. పడమట జర్మనీలోనున్న పరిశ్రామిక కేంద్రాలనుండి తూర్పున యుద్ధ రంగాలకు మందుగుండు సామానులు పోవుటకు వీలులేకుండా, బ్రిటిషు విమానదాడులు చేయుచున్నవనిరి.

### అక్ష రాజ్యాల నేరములు

అక్ష రాజ్యాల ఘోర నేరములుగూర్చి తెల్పుచు ఈడెనుగారు, నాగరిక న్యాయములను ధ్వంసం చేయ యత్నించువారిని శిక్షించినగాని న్యాయం స్థాపింపబడదని, వారిని శిక్షించుటకు మిత్ర రాజ్యాలు నిశ్చయించుకొన్నవనిరి శత్రువులాక్రమించిన దేశాలనుండి శత్రువును తరిమివేసి, అచట సివిలు ప్రభుత్వం న్యాయం స్థాపించబడుననిరి ఈ పని ప్రారంభంలో సైన్యం తణిఖీపై జరుగవలసియుండుననియు, క్రమేణ శత్రు నిర్మూలనం జరిగి సక్రమ విధానం ఏర్పడుచున్నకొలది పరిపాలనా బాధ్యత సివిలు ప్రజలకు ఒప్పగించబడుననియు చెప్పిరి.

అమెరికా యుద్ధంలో చేరినందున, యీ విషయం అమెరికా అధికారులతోగూడ పునరాలోచన జరుపబడెననియు, యీ సహాయకార్యమునందు సంయుక్త రాజ్యాలన్నియు పాల్గొనవలసియుండుననియు, తన విషయం రష్యా రాయబారితో సంప్రదించితిననియు, దూర ప్రాచ్యమునందు కష్ట నివారణగూర్చి చీనా ప్రభుత్వంతో ఆలోచించితిమనియు చెప్పిరి. ఈ పనంతా యుద్ధానంతరం ఒక్కమారుగ జరుగదు గనుక, యిప్పటినుండే ఏర్పాటులు జరుపుట మంచిదనియు చెప్పిరి అక్ష రాజ్యాల నిర్బంధంనుండి విడుదలచేయబడు దేశాల కష్ట నివారణకు సత్వర యత్నములు గైకొన సంయుక్త రాజ్యాలకు యిష్టము శక్తికూడ యుండాలనిరి. యూరోపులో తమ మిత్రుల దుస్థితి తొలగించుటకు బ్రిటిషు ప్రజలు ఎంత త్యాగానికైన ఒప్పుకొందురనిరి.

"యుద్ధానంతరం ప్రపంచ పునరుద్ధరణ కార్యం, నాగరికతకు సహజమగు సక్రమ పద్ధతులను శాశ్వతశాంతి నెలకొల్పుటయు సంయుక్త రాజ్యాలపైని, అందులో ముఖ్యంగా బలవత్తరమగు రాజ్యాల అన్యోన్య సహకారంపైని ఆధారపడియున్నది ఈ విషయంలో అమెరికా సంయుక్త రాష్ట్రాలతో కలసి నడచుటకును, సోవియటు రష్యాతో పూర్తిగ సంప్రదించుటకును నిశ్చయించుకొంటిమి చీనా యిందులో నాల్గవ భాగస్వామి చిన్న రాజ్యాలన్ని కలసి పెద్ద గ్రూపులుగనుండుటను ఇంగ్లాండు ప్రోత్సాహించును. అట్లయిన బలవత్తరమయిన రాజ్యాలతో అవికలసి శాంతి కాపాడుటకు తోడుగ పనిచేయగలవు

"యుద్ధానంతర ప్రపంచంలో స్థిరమగు ఒడంబడిక, అన్యోన్య విశ్వాసము, నిజం తెలుసుకొని నిరోధాలను ఎదిరించే యిచ్చవుంటేగాని, కుదురవు విప్లవకరమగు గొప్ప మార్పులను రానున్నవాటిని ఎవ్వరు నిరోధింపజాలరు మన జాతియందు విశ్వాసమును, ప్రపంచంలో బలవత్తరమగు రాజ్యమగుటచే మనకుగల పూచీ బాధ్యతలను మనం గుర్తించినగాని కార్యంనెరవేరదు. ఈ ధర్మం

# బర్మాను తిరిగి ఆక్రమించాలి.

## వావెలు సేనాని యుద్ధ సమీక్ష.

## ఇండియాలో ఎట్టి ప్రమాదం లేదు.

"బర్మా పోయిందగ్గరనుండి, తిరిగి ఆ దేశాన్ని ఆక్రమించాలని నేను ప్రయత్నిస్తున్నాను. ఏమంటే జపానుతో యుద్ధం సాగించుటకు అది ప్రధాన కేంద్రము చీనాతో సంపర్కం కలిగి యుండుటకును, జపానుపై దాడి సలుపుటకును బర్మా మనకవసరం"

అని సర్ ఆర్చిబాల్డు వావెల్ సేనాని, ఇండియా ప్రధాన సేనాధిపతి, ఢిల్లీలో వారికి విదేశ పత్రికా ప్రతినిధులొసంగిన విందు సందర్భమున ఉపన్యశించుచు తెలిపిరి వారింకను యిట్లు తెలిపిరి

"బర్మాను తిరిగి ఆక్రమించుటగూర్చి నా వూహలెన్నో ఉన్నాయికాని నా కార్యవిధానం పైకి చెప్పజాలను అది కష్టసాధ్యమే సప్లయి లందుకొనుటలో నే నెప్పుడు చివరవాడనే. ఈజిప్టులో రోమెలు మరల దాడి ప్రారంభించేడు కనుకనూ, కాకససునకు ప్రమాదంవుంది కనుకను, ముందుగ అక్కడకు సరకు క్రొత్త సేనలును పోక తప్పదు. అయినా యిపుడక్కడ పరిస్థితులు చక్కబడి మాకు కావలసిన సరకు లందుచున్నవి ఈ యుద్ధంలో అతికష్టమైన కార్యం నౌకలు లభించుటే"

### జపాను విమానశక్తి లోపం

"జపానువారేమి చేయనున్నారన్నదే ప్రశ్న, కొండచలువ పామువలె వారు తిన్న దరిగించుకోలేక కష్టపడుచున్నారు ఇపుడు వారు ఆస్ట్రేలియా లేక ఇండియాలపై దాడి తలపెడతారని నే ననుకోను. విమానశక్తిలోనే జపానువారు బలహీనంగానున్నారు వారు స్వదేశంలో కొంత ఉంచుకోవాలి, రష్యాపై సర్వదా కాపలాకొరకు మంచూరియాలో కొన్ని విమానాలుంచాలి, నైరుతి పశిఫికులో కొంత ఉంచాలి ఏషియాలో మహా సామ్రాజ్యాధికారం సంపాదించదలచిన జపాను, ముందుగ రష్యా నిరోధం తొలగించుకోవాలి, చీనా వ్యవహారం పరిష్కారం చేసుకోవాలి.

### రష్యా రంగం

రష్యా విషయమే చిక్కైనది అదియే ఇండియాకు సంబంధించిన సమస్య రష్యా సైన్యాన్ని యీ వేసంగిలోనే నిరుపయోగం చేయాలని జర్మనీ ఆశ అపుడు తిరిగి శీతకాలంలో తాము కోలుకొని పడమర యూరోపులో పురోగమన దాడి చేయాలని వారి ఉద్దేశం. వచ్చే యేడు మధ్య ప్రాచ్యంలో రెండు వైపులనుండి పటకారు కాడలవంటి దాడి జరిపే యత్నంలోకూడ వారుండవచ్చును.

"ఇపుడపుడే దాడులుచేసే కాలం మించిపోతున్నది. ఋతు పరిస్థితులుగూడా మనం శ్రద్ధగ గమనిస్తూవుండాలి ఆఫ్రికా ఎడారిలో ఎండకాలం మనం యుద్ధం చేయలేమన్నారు, కాని మనం యుద్ధంచేసేము అంతకన్న అబిసీనియాలో వానలు మన దాడులకు ఆటంకంకాలేదు, ఉత్తరాన రష్యా సైన్యం చెక్కుచదరకుండాను, దక్షిణాన కాకసను యధాప్రకారంగానూ వుంటే జర్మనులకేమి లాభం. స్టాలినుగ్రాడును రష్యనులు గోల్పోవచ్చు, కాని అదంతగా పరిస్థితులను మార్చదు వోల్గానది దిగువభాగం యీ సాలాంతమున గడ్డకట్టును. కాకసను కొండల దక్షిణ మార్గములలో అపుడే మంచు కురియుచున్నది. జర్మనులు కాకసను కొండలు దాటి దక్షిణానికి యిపుడుగాని, రానున్న వసంత ఋతువులోగాని వచ్చి పెర్షియాలో చమురుగనులు పట్టుకొనుట సులభమయిన పనిగాదు. ఇది ఇండియాకు పడమటి కనుమయగుటచే నాకు సంబంధించిన విషయం."

### ఇండియాలో పరిస్థితులు

"ఇండియాలో పరిస్థితులు సంతృప్తికరంగానే యున్నాయి. దేశంలో అల్లరులు జరిగి

---

గుర్తించినచో మిత్ర రాజ్యాలతో ఒడంబడిక కుదురుట సులభ సాధ్యమగును."

చర్చిలు ప్రధాని నాయకత్వమును కొనియాడి, పైనుండు పెద్దల నాయకత్వమేకాక, గమ్యస్థానం చేరాలను స్థిరసంకల్పంగల జాతియంతటి సమిష్టి నాయకత్వం యిపుడు అవసరమని ఈడెనుగారు తెలిపిరి.

# యుద్ధం భోగట్టాలు

## ఇండియా సిపాయిలకు అక్టోబరు 1—ఎక్కువ డబ్బు.

భారతీయ సిపాయీలకు ఒక ముఖ్యమగు ఆర్థిక సౌకర్య మొసంగబడును వారి జీతంలో మిగిలించుకున్న ప్రతి రూ 50 లకు వారికి మూడు నెలలకు అ 6 లు వడ్డీ వచ్చును అదివరకు అటువంటి ప్రోత్సాహమేమి లేకుండెను చాలమంది సిపాయీలు దూరదృష్టి కలిగి, ప్రతి నెల తమ జీతంలో కొంత డబ్బు మినహాయించి తమ లెక్కలో జమ చేయమని కోరుచుండిరి అట్లా చూమకున్న వారందరికి అక్టోబరు 1 వ తేదిన బహుమతులు ముట్టును

"ఎగిరే పులులు."

అమెరికా వైమానికులు 20—30 సంవత్సరములవారు "ఎగిరే పులుల"నబడుదురు వారిలో పెక్కండ్రు అవివాహితులు వారు చీనా విమానదళంతో కలసి దక్షిణ ఏషియా యుద్ధరంగమున పనిచేయుచున్నారు, సుమారు 100 మంది వీరు గత మూడేండ్లలో 300 జపాను విమానాలను, 800 మందిని జపాను వైమానికులను నాశనం చేసిరి అమెరికను వాలంటీరు గ్రూపుకి చెందిన వీరు యిపుడు అమెరికా సైన్యంయొక్క విమానదళమునందు చేర్చబడిరి

జపాను నష్టం

గత ఐదేండ్లు చీనాతో యుద్ధఫలితంగా జపాను 2,500,000 సైనికులను నష్టపోయెను వారిలో నూటికి 40 మంది చనిపోయి, 60 మంది గాయపడిరి ఖైదీల సంఖ్య 29,924 చీనాకు వశపడిన జపాను ఫిరంగులు 1,981, మరఫిరంగులు 8,576, తుపాకులు 1,192,420, 8,841 టాంకులు మోటారుబండ్లు గలవు 2,504 జపాను విమానాలు పడగొట్టబడినవి

1941 వ సం॥ ఏప్రిల్‌నుండి 1942 వ సం॥ ఫిబ్రవరి ఆఖరువరకు అమెరికానుండి ఇంగ్లాండుకి 1,800,000 టన్నుల ఆహార పదార్థములు దిగుమతి అయినవి.

ఇంగ్లాండులో పన్నులు

ఇంగ్లాండులో నేడు గొప్పవారు నూటికి 95 చొప్పున రాబడి పన్ను చెల్లించెదరు ప్రతివారు తమ తినుబడి సరకులలో నూటికి 70 వంతు తగ్గించుకొనిరి ప్రయాణాలు 30 వంతు తగ్గించిరి ఇతర అవసరాలు నూటికి 25 వంతు తగ్గించుకొనిరి ఇంగ్లాండు ప్రధానమంత్రి సాలీనా 10,000 పౌనులు పుచ్చుకుంటున్నారు 7,000 పౌనులు పన్నులక్రింద యిస్తున్నారు.

ఇండియాలో 1940-41 సంవత్సరమునందు కాగితం ఉత్పత్తి 1,753,000 హండ్రెడు వెయిట్సు 1928-29 సంవత్సరంనుండి యింతవరకు యింత ఎక్కువ ఉత్పత్తి జరుగలేదు

చీనా ప్రభుత్వంవారు పెకిను సిండికేటు లిమిటెడు ద్వారా ఇండియానుండి ఇంతవరకు రూ 2½ కోట్ల విలువగల వస్తువులు యుద్ధంకొరకు తెప్పించుకొనిరి

---

నపుడు కొంత యుద్ధ ప్రయత్నానికి భంగం కలిగినప్పటికిన్ని ప్రతినెల 70,000 మంది క్రొత్తగ సైన్యంలో చేరుచునేయున్నారు. సైన్యంలో ఎటువంటి చిక్కూలేదు

"జర్మనీపై దాడులు తరుచు జరుగుతూ వుంటే, రష్యాలో జర్మనులంతగా నష్టపోతూ వుంటే, యీ శీతకాలంలో జర్మనీలోని ప్రజలకు ప్రోత్సాహం కలిగించుట కష్టం. యూరోపులో జర్మనీయొక్క క్రొత్త ఏలుబడి సరిగ్గా సాగడం లేదు. యూరోపులోని వస్తు సామగ్రులను జర్మనులు సొంత ఉపయోగానికి దోచుకుంటున్నారు. యూరోపు ప్రజలు తిరిగి స్వాతంత్ర్యం పొందడానికి మనం చాల పెద్ద యుద్ధాలుచేయాలి. గత యూరోపు యుద్ధంలో సోమునదివద్ద యుద్ధం జరిగినపుడు మొదటి రోజే బ్రిటిషు సైన్యం 60 వేలు నష్టమయింది. కాని చిట్టచివరకు జర్మను సేన నాశనంచేయబడింది. యుద్ధ పర్యవసానం గూర్చి నాకేం సందేహంలేదు. ధైర్యం స్థిరచిత్తంవుంటే మనం తప్పక గెలుస్తాము. అమెరికా, మనము, రష్యా, చీనా యీ నాల్గు రాజ్యాలు చివరవరకు పోరాడుతాయి."

---

### ఇండియాలో బ్రిటిషు వ్యాపారం ఒక సాకా?

బ్రిటను జవాబు.

"రాజ్యాంగ విధాన నిర్ణయమునకు ముందు ఇండియాలో బ్రిటిషు వాణిజ్య హక్కులకు ప్రత్యేక రక్షణ యుండాలన్న షరతు విధించబడదు. రాజ్యాంగ విధానంలో అట్టి రక్షణ అవకాశము వుండాలా వద్దా అన్నది భావి భారత ప్రభుత్వంతో రాయబారములు జరిపి నిర్ణయించుకొనుట ఉచితము. ఇండియాలో మనం రాజ్యాంగ విషయాలగూర్చి పాఠాలు చెప్పే స్థితి గడిచిపోయింది, ఇపుడు నిర్మోగమాటంగా వ్యవహరించు భాగస్వాములుగ నున్నాము."

—కామన్సు సభలో 30-7-42 తేదిన ఇండియా సహాయ కార్యదర్శి డెవంషైరు ప్రభువుగారు

---

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS.